| విషయము : | పేజి |
|---|---|
| 6) కాలీ ఫాస్ఫారికమ్ (K P.); | |
| కాలీఫాస్-వైద్య లక్షణాలు | 87 |
| 7) కాలీ సల్ఫ్యూరికమ్ (K.S.); | |
| కాలీసల్ఫ్-వైద్య ప్రయోజనాలు | 89 |
| 8) మెగ్నీషియా ఫాస్ఫారికా (M.P ) | 90 |
| మెగ్నీషియాఫాస్-వైద్య ప్రయోజనాలు | 91 |
| 9) నేట్రమ్ మ్యూరియాటికమ్ (N.M.) | 93 |
| నేట్రమ్మూర్-వైద్య ప్రయోజనాలు | 94 |
| 10) నేట్రమ్ ఫాస్ఫారికమ్ (N.P.) | 96 |
| నేట్రమ్ఫాస్ వైద్య ప్రయోజనాలు | 97 |
| 11) నేట్రమ్ సల్ఫ్యూరికమ్ (N.S.); | |
| నేట్రమ్సల్ఫ్-వైద్య ప్రయోజనాలు | 98 |
| 12) సైలీషియా లేక సిలికా (Sil.) | 100 |
| సిలికా- వైద్య ప్రయోజనాలు | 101 |

## రచయితగా మీతో ఒక్క క్షణం......!

నేను ఇప్పటి వఱకు- మెడికల్‌గైడ్, హోమియో వైద్యము, హెల్త్ & బ్యూటి, యోగశాస్త్రము, ప్రకృతి వైద్యం, వైద్య ప్రపంచము, సెక్స్ & హోమియో, మెడికల్ డిక్షనరి. అను గ్రంథములను- ఆంధ్ర పాఠకలోకానికి "జనప్రియ పబ్లికేషన్స్, తెనాలి-1" వారి ద్వారా అందించడము జరిగినది. ఇవి- "సామాన్య ప్రజానీకానికి ఎంతగానో ఉపకరించినవని- విజ్ఞులైన పాఠక మహాశయులు వ్రాసిన అనేక ఉత్తరాలు చూసి, గ్రహించితిని!

పైన తెలిపిన గ్రంథాల రచనతోనేగాక- ఇంకా అనేక వైద్య గ్రంథాలద్వారా అఖిలాంధ్రులకు నా వైద్య సేవల నందించాలనే తలంపుతో నా వైద్య ప్రక్రియలలో కీర్తి తెచ్చిన- ఈ "హోమియో వైద్యము-2" అను- 'ద్వాదశ లవణ చికిత్స'ను- తెలుగు పాఠక లోకానికి సవినయముగా అందిస్తున్నాను. ఈ చికిత్స అత్యంత సులభమేగాక....వ్యాధులకు-ఏ ఇతర ఔషధాలను వాడుతున్నా-ద్వాదశ లవణాలను కూడా అవసరము మేరకు వినియోగిస్తే-ఆయావ్యాధులు త్వరితగతిని నివారించి తగ్గుముఖము పడతాయి. అంతేగాక.... జ్ఞాపకము వుంచుకోవడానికి తేలికగా వుంటాయి. ఈ వైద్యము ప్రకృతి ప్రసాదించిన ఆహార పదార్థాలతోచికిత్సనెరవుకున్నట్లుగా వుంటుంది. (ఈ గ్రంథ ప్రచురణకర్తలు ప్రచురించిన- డా॥ A.ప్రభాకరబాబు, M.B.B.S. గారు వ్రాసిన "ఆహారం-వైద్యం" వెల : Rs.30/- మఱియు నాచే వ్రాయబడిన "హోమియో వైద్యం"వెల: Rs.15/- అను గ్రంథాలను చూడండి! ప్రతులకు : "జనప్రియ పబ్లికేషన్స్, తెనాలి-1"వారికి M.O.చేయగలరు-రచయిత) అల్లోపతిలోవిటమిన్స్ లోపిస్తే ఏ విధముగా లోపించిన విటమిన్స్ ఇస్తారో ఈ ద్వాదశ లవణ చికిత్స కూడా అలాగే వుంటుంది. విధానము వ్యాధి పేరుతో

గాక.... హోమియో వైద్య విధానమువలెనే.... రోగి అనుభవించే బాధా లక్షణాలతో- వైద్యము చేయవలసి వుంటుంది.

ద్వాదశ లవణాలు- 12 రకాలే కాబట్టి గుర్తుపెట్టుకోవడము తేలికేగాక.... ప్రతి హోమియో మందుల షాప్సలోనూ విరివిగా లభిస్తాయి. పైగా ఈ మందుల ధర అతిస్వల్పము! ఇతరత్రా "సైడ్ ఎఫెక్ట్స్" ఈ మందుల వలన వుండవు!!

ఈ "ద్వాదశ లవణ వైద్య విధానము"- అందరికీ తేలికగా నుండుటయేగాక- నమ్మకముగా పనిచేస్తుంది. వైద్యునిగా- నా అను భవములో సరిచూడబడిన ఈ వైద్య విధానమును మీకు అందిస్తు న్నాను. దీనిని చక్కగా అవగాహన చేసికొని- మీకేగాక.... మీ మిత్రులకు, వైద్యార్తితో వున్న రోగులకు-వైద్యసహాయాన్ని అంది స్తారని ఆశిస్తూ.... అఖిలాంధ్ర పాఠక మహాశయుల ఆదరాభిమానా లను ఎల్లవేళలవాంఛిస్తూ....మరొకవైద్యగ్రంథాన్ని మీ ముందుంచ డానికి ఉపక్రమిస్తూ.... సెలవుకోరే....

మీ ఆరోగ్యాభిలాషి

—డా॥ K.V.N.D. ప్రసాద్,

D.H.M.S.

---

# హోమియో వైద్యం-2

## "ద్వాదశ లవణ చికిత్సలు"

### జీవ రసాయనిక శాస్త్రి పరిచయము

శుక్ల-శోణితాల కలయికవలన- జీవకణాలనుండి ఉద్భవించిన పిండము... క్రమక్రమముగా- వాటి వాటి ప్రత్యేక లక్షణాలతో కోటానుకోట్ల కణాలుగా విభజన చెంది, కణము- ధాతువుగానూ; ధాతువులు- చర్మము, ఎముకలు మొ॥గు అవయవాలగానూ ఏర్పడి; శిశువు స్త్రీ గర్భము నుండి వెలువడుతుంది. అట్లు వెలువడినశిశువుకు- ఈ బాహ్య ప్రపంచమునందు లభించు- పాలు, పండ్లు, ధాన్యాలు మొ॥గు ఆహార పదార్థాల వలన- ధాతుకణాలు వృద్ధిచెంది, శరీరము- పెరిగి, పెద్దదై- శక్తియుతముగా మారుతుంది.

ఈ విధముగా తీసికొను ఆహార పదార్థాలలోని శరీరానికి అవసరమైన పదార్థాలని తెలిసికొనే శాస్త్రిన్నే "జీవరసాయనిక శాస్త్రము" అని అంటారు. మనము తీసికొనే ఆహారములో- తగిన పోషక విలువలు లభించనపుడు....ఆయా ధాతుకణాలు కలతచెంది- ఆయా శరీర భాగాలు వ్యాధిబాధల నందుతాయి! ఈ సమయములో ఏ పదార్థము తగ్గినదో గుర్తించి- దానిని శరీరాని కందించిన... వ్యాధులు సమసిపోతాయి! ఈ ద్వాదశలవణ విధానంలో-ఇదే మూల సూత్ర రహస్యము! ఇలాంటి మహత్తర వైద్యసిద్ధాంతాన్ని- ప్రప్రథమముగా ఆవిష్కరించి నిరూపించిన మహనీయుడు- డా॥ స్క్యూస్లర్ (Schussler). వీరి ఈ వైద్య సిద్ధాంతము- హోమియోపతి చికిత్స లకేకాక....నేటి అనేకఆధునిక వైద్య విధానాలకుకూడా ఆదర్శమైన దంటే- దాని విశిష్టతను వేరే చెప్పనక్కరలేదు. ఈ ద్వాదశ లవణ వైద్య సిద్ధాంతాలు దేనికి అనుకరణగాక.... దానికదే ప్రత్యేక సిద్ధాంతముగల వైద్యము!!

## ద్వాదశ లవణ వైద్య మూల సిద్ధాంతము

సజీవమైన ధాతువులయందుండు కణాలలోని "లవణాలు" కావలసిన పరిమాణముకంటే తగ్గినపుడు-ఈ లవణాలందు, అణువుల చలనమునందు సంభవించే కలతయే.... వ్యాధి! ఆయా పదార్థాల ద్వారా-ఆయా లోపాలను నివారించడమే... నివారణ!!

నీరు, పొటాష్, కాల్షియమ్, సిలికా (ఇసుక), ఐరన్, మెగ్నీషియమ్, సోడియమ్లాంటి ఖనిజ-లవణాలను (అనంగారక పదార్థాలు లేక నిరీంద్రియ పదార్థాలు) శారీరకముగా- లోపించడమో, ఎక్కువౌడమో జరిగినపుడు- వ్యాధు లుద్భవిస్తాయి. ఈ లోపించిన పదార్థాలను- ఆహార రూపములోగానీ, ఔషధరూపములోగానీ- శరీరానికందించి- ఆయా వ్యాధులను నివారించాలి! ఈ ఔషధాలను 12రకాలుగా విభజించారు- డా॥ స్కూస్లర్!!

## ద్వాదశ లవణ పదార్థాలు

1. కాల్కేరియా ఫాస్ (C.P.); 2. కాల్కేరియాఫ్లోర్(C.F.); 3. కాల్కేరియా సల్ఫ (C.S.); 4. ఫెరమ్ఫాస్ (F.P.): 5. కాలీమూర్ (K.M.); 6. కాలీఫాస్ (K.P.): 7. కాలీసల్ఫ (K.S.);8. మెగ్నీషియాఫాస్ (M.P.); 9. నేట్రమ్ఫాస్ (N.P.); 10. నేట్రమ్ మూర్ (N.M.); 11. నేట్రమ్సల్ఫ (N.S.); 12. సైలీషియా లేక సిలికా (SIL.).

## ద్వాదశ లవణాలు-నివారించు వ్యాధి భాగాలు

నరాల వ్యాధులయందు :- మెగ్నీషియాఫాస్, కాలీఫాస్, నేట్రమ్ మూర్, ఫెరమ్ఫాస్ అద్భుతముగా పనిచేస్తాయి.

కండరాల వ్యాధులకు :- కాలీమూర్ దివ్యౌషధము !

సంధాయక ధాతువుల యందు కలిగే వ్యాధులకు :- సిలికా;

స్థితిస్థాపకధాతు వ్యాధులకు :- కాల్కేరియాఫ్లోర్, మెగ్నీషియాఫాస్; కాల్కేరియా ఫాస్లు- అమృతములాగా పనిచేస్తాయి.

జుట్టు, పారదర్శక అద్దములయందు కలిగేవ్యాధులకు:-ఫెరమ్ఫాస్;

ఎముకల ధాతువులయందలి వ్యాధులకు:- కాల్కేరియాఫ్లోర్;

మొత్తము శారీరకముగా కలిగే బలహీనతలకు :- కాల్కేరియాఫాస్ ఉత్తమము!

## ద్వాదశ లవణాలు తయారు చేయు విధానము

ఈ ఔషధాలను తయారు చేయు విధానము- "ఆర్గనాన్ అఫ్ మెడిసన్ (Organon of Medician)" అను గ్రంథములో- 264 నుండి 274 పేజీలనూ; "ద్రికానిక్ డిసీజెస్- దెయిర్ పెక్యూలియర్ నేచర్ అండ్ దెయిర్ హోమియోపతిక్ క్యూర్" అను గ్రంథము లోనూ లభ్యమగును. ఇక్కడ సంక్షిప్తముగా తెలియజేయబడినది.

డ్రగ్స్ (సహజ పదార్థము= మూల పదార్థము)ను- శక్తి యుతము చేయు విధానాన్ని-హోమియోపతిలో-"పొటెన్సీ మరియు డైనమిజేషన్ (Potencies & Dynamization)" అని పిలుస్తారు. అల్లోపతిలో- దీనిని మి॥గ్రా॥ (M.g.)లు అని ఉదహరిస్తారు. ద్వాదశ లవణాలను రెండు విధాలుగా శక్తియుతము చేస్తారు.

మూల పదార్థమును ద్రవరూపములో శక్తియుతము చేయా లంటే - నీరుగానీ, ఆల్కహాల్‌గానీ చేర్చి గట్టిగా కుదుపుటతోనూ; ఘనరూపములో చేయాలంటే- పాలు, పంచదార లాంటివి చేర్చి నూరుట చేతను చేయవచ్చును. ఈ రెండు పద్ధతులలో ఏ విధ ముగాతయారు చేసినా- ఔషధము శక్తియుతమై, డైనమిక్ పవర్‌తో పని చేస్తుంది.వీటిలోని ఔషధీధర్మాలు(Medical Spirit) మేల్కొన బడి, మన శరీరము నందుగల- జ్ఞాన-కర్మేంద్రియాలు వీటి ప్రభావ ముతో... ఇంచుమించు అద్భుత చైతన్య శక్తిని బడయుచున్నవి. ఈ పొటెన్సీలను- 1. శతాంశ పద్ధతి; 2. దశాంశ పద్ధతిలో తయారు చేస్తారు. వైద్యపరిభాషలో- శతాంశ పద్ధతిని- "డెసిమల్ స్కేల్స్ (Decimal Scales)" అనీ, దశాంశ పద్ధతిని- "సెంటిసి మల్ స్కేల్స్ (Centicimal Scales)" అని పిలుస్తారు.

ప్రిస్క్రిప్షన్ వ్రాయునపుడు- ముందు మందు పేరు వ్రాసి, ఎంత పవర్ కావాలో అంకెవేసి- ప్రక్కన "X" అని గుర్తుపెట్టిన- దశాంశ పద్ధతిలో తయారైన మందులూ; "C" అని గుర్తు పెట్టిన- శతాంశ పద్ధతిలో తయారైన మందులను ఇస్తారు.

## తరుణ, దీర్ఘవ్యాధులు-పవర్ నిర్ణయము

దశాంశ పద్ధతిలో తయారైన ఔషధములో-పదార్థము ఎక్కువగా వుండుట వలన- శారీరకము (ఫిజికల్)గా వున్న వ్యాధులను-తగ్గించును. శతాంశ పద్ధతితో తయారైన మందువలన- శరీరాంతర్గతముగానూ, మానసికముగానూ పనిచేసి- శరీరతత్త్వమును మార్చడానికి పనిచేస్తుంది. అంతే గాక .. వ్యాధి లోతుగా వున్నా-పూర్తిగా నివారించును. అంటే తరుణవ్యాధులలో- "X (దశాంశ పద్ధతి)" పవర్‌నూ, దీర్ఘ మరియు మానసిక వ్యాధులలో- "C (శతాంశ పద్ధతి)" పవర్‌నూ ఉపయోగించాలన్నమాట!

## ద్వాదశ లవణాల మోతాదు (డోస్) నిర్ణయము

డా॥ షూస్లర్- ద్వాదశ లవణాలను అతి సూక్ష్మ మోతాదులలోనే వాడవలెనని తెలిపెను. పెద్ద మోతాదులు ఒక్కొక్కసారి తరుణ వ్యాధులను కూడా సృష్టించే ప్రమాదమున్నది. నా అనుభవములోకూడా ...సూక్ష్మమోతాదులే- ఎక్కువఫలితాలనుచేకూర్చాయి!

| వయస్సు : | పిల్స్ : | పౌడర్ : | టాబ్లెట్స్ : |
|---|---|---|---|
| 5 సం॥లోపు : | 2 | 1 గ్రైన్ | 2 |
| 15 సం॥లోపు : | 2 | 2 " | 3 |
| 25 సం॥ : | 4 | 3 " | 4 |
| ఆపైన : | 5 | 4 లేక 5 " | 5 |

## పొటెన్సీ (Potency "శక్తి") నిర్ణయము

"ద్వాదశ లవణాలు"అనబడు ఈనిరింద్రియ పదార్థాలు 12× పవర్‌లోనే బాగా పని చేస్తున్నాయని నా అనుభవములోని అనేక కేస్‌లలో రుజువైనది. అంతేగాక- టాబ్లెట్స్, పౌడర్ రూపములోనే ఎక్కువ ఫలితాలను ఇస్తున్నాయి. అవసరమనుకున్నపుడు 12× పవర్ పైబడి 30× పవర్ వరకు తరచుగా వాడ వచ్చును. 30× పవర్‌పైన (అంటే 200×వరకు) ఔషధాలువినియోగించు

కానవలసినపుడు- తప్పకుండా అనుభవజ్ఞులైన వైద్యునిపర్యవేక్షణ వుండాలి! వ్యాధి లక్షణాలు తెలిసికోకుండా ఎక్కువ పొటెన్సీలు ఉపయోగిస్తే.... అనేక అనర్థాలకు దారి తీసే ప్రమాదాలు వెన్నంటి వుంటాయని గ్రహించాలి!! కాబట్టి.... సాధారణముగా అందఱూ- 6×, 12×, 30× పొటెన్సీల వఱకే వినియోగించాలి! ఈ పొటెన్సీలే- నాకు 90% కేసులలో విజయాన్ని చేకూర్చాయి!

## మోతాదు వాడవలసిన కాల పరిమితి

సహజముగా- తరుణ వ్యాధులలో- ప్రతి 15 ని॥లకు ఒక డోస్ వేయవలసి వస్తుంది. ఈ విధముగా వ్యాధి తీవ్రతను బట్టి మాత్రమే ఉపయోగించాలి. వ్యాధి అంత తీవ్రముగా లేనపుడు- గంటకు 1 డోస్ చొప్పున గానీ, మరీతీవ్రముగా లేనపుడు-3 గంటలకు 1 డోస్ చొ॥న గానీ వాడాలి. అదే విధముగా- సహజ, దీర్ఘ వ్యాధులలో ఐతే రోజుకి 2 లేక 3 డోస్‌లు వాడాలి. ఆరోగ్యానికి, బలానికి వాడేవారు- రోజుకి 1 మోతాదు వాడుకొంటే చాలు!

## సూక్ష్మ మోతాదులతో- వ్యాధి నివారించునా ? ఒక విశ్లేషణ!!

ద్వాదశ లవణ చికిత్సా సిద్ధాంతములో- శరీరములోని ధాతు కణాలు యథాస్థితిలో వుండటమే- "శారీరకారోగ్యము" వున్నట్లుగా భావించడమైనది. ధాతు కణాలలో మార్పు వచ్చినపుడు- సంభవించే.... వివిధ వ్యాధి లక్షణాలను నివారించడానికి- లోపించిన ఆయా లవణాలను "సూక్ష్మమోతాదు"ల ద్వారా భర్తీ చేసి- యథాస్థితికి తీసుకురావడమే చికిత్స !

ఇప్పుడు చర్చనీయాంశ మేమిటంటే.... వ్యాధి లక్షణాలను రూపు మాపడానికి- సూక్ష్మాతి సూక్ష్మమైన మోతాదు సరిపోతుందా? అన్నది. ఈ అనుమానము ఈ రోజు అనేక మందిని వేధించుచున్నది. ఈ అనుమానానికి- నేను గ్రహించిన విషయాలను చిన్న వివరణగా- ఈ క్రింద ఇస్తున్నాను! మీరూ పరిశీలించండి!!

ఒక 50 కేజీల మనిషికి- సుమారు పూటకి 1కిలో ఆహారము సరిపోతుందంటే.... ఈ శరీరములో ఎక్కడో ఒక భాగములోని ఒక్క అణువులో సంభవించిన కలత(లోపము)కి- ఎంత పదార్థము అవసర మౌతుందో విజ్ఞులైన పాఠకులే ఆలోచించవలసినదిగా కోరుచున్నాను !

ఉదాహరణకి :- 14 పౌన్ (6 Kg.లు)ల బాలుని ఎదుగుదలకు 6 సెం॥గ్రా॥ (1.5 గ్రైన్‌లు)ల మెగ్నీషియమ్‌సరిపోతుంది. దీనినిబట్టి- ఈ పిల్లవానికి- "1 లీటర్ పాలు చాలు!" అని వైద్య శాస్త్రము నిర్దేశిస్తుంది. అంటే 1లీటర్ పాలలో- 3.5 గ్రైన్‌ల మెగ్నీషియము ఉన్నదన్నమాట! ఈ బాలునికి ఏదోకణములో మెగ్నీషియమ్ లోపించి- ఆ కణములో కలత సంభవిస్తే- ఎంత మోతాదులో మెగ్నీషియమ్ ఇవ్వవలసి వుంటుందో- ఊహించండి!! ఈ విధముగానే ఈ బరువు కలిగిన బాలునికి- రక్త వృద్ధికి 4 మి॥ గ్రా॥ల ఐరన్ అవసరమౌతుంది. 1 లీటర్ పాలలో 4 మి॥గ్రా॥ల ఐరన్ కూడా వున్నది. దీనిని బట్టి మనకు ఒక విషయము ప్రస్ఫుటముగా అర్థమౌతున్నది. మన శరీరములో- ఏది ఎంత పరిమాణములో లోపించిందో.... దానిని ఆ పరిమాణములో భర్తీచేయడమే ముఖ్య కర్తవ్యము!

వేసవిలో- దాహముతో నోరు ఎండి పోయినపుడు- అతనికి నీరు అందించని ఎడల- దాహముతో అతను మరణించును. ఈ విధముగానే.... ఆకలితో వున్న వారికి ఆహారము అందించకపోతే శోషిల్లిపోక తప్పదు. అంటే శరీరానికి ఏది కావాలో.... కొన్ని లక్షణాల ద్వారా- మనకు తెలియ బఱుస్తుందని దీనిని బట్టి అర్థమౌతున్నది కదా!

పై విషయాలననుసరించి ఏదిఎంతఅందించాలోఅంతేఅందించాలిగానీ- అతిగాఇచ్చినా, అనవసరమైనవి ఇచ్చినా అనేక దుష్పరిణామాలువాటిల్లక తప్పదు. ఇదే ద్వాదశలవణచికిత్సలో ని "అత్యద్భుత విశిష్టత!"కాబట్టి- కొన్ని కణాలలోనికలతనునివారించడానికి-సూక్ష్మాతి

సూక్ష్మమైనమోతాదులో ఔషధము వాడినచాలును! ఈ సిద్ధాంతమే- ద్వాదశలవణ వైద్యానికి మూలము!పునాది!! డా॥ కెంట్- "హెచ్చు మోతాదులు- ఇరువైపుల పదును గల కత్తి వంటివి!" అని హెచ్చరించారు.

## ద్వాదశలవణ వైద్యములో- పథ్య పానములు

ద్వాదశ లవణౌషధములు సేవించునపుడు ఎలాంటి పథ్య-పానములు, నియమములు లేవు! కాని వ్యాధిని బట్టి, వ్యాధిగ్రస్తుని అలవాట్లను బట్టి వాటిని నిర్ణయించాలి! ఈ ద్వాదశ లవణౌషధాలను- "సేవించుటకు ముందు- గంట, సేవించిన తరువాత- గంట ఎలాంటి- ఘన, ద్రవ పదార్థాలు- తినరాదు, త్రాగరాదు!"

## ద్వాదశ లవణౌషధములను భద్రపరచువిధానము

హోమియో మందులకు వలెనే- వీటికి కూడా ఏ విధమైన- సువాసన, దుర్వాసనలు తగుల నీయరాదు. అలాగే- ఎండ వేడిమి గానీ, నెమ్ముగానీ సోకనీయరాదు. ఈ మందులను భద్రపరచు పెట్టెలు- అన్ని హోమియో స్టోర్స్‌లలోను లభించును. వీటిని తీసికోనేటపుడు- చేతులతో తీసికోకుండా- శుభ్రమైన తెల్లని కాగితములో మందును తీసికొని, నోటిలో వేసికోవాలి.

## ద్వాదశ లవణౌషధములు లభించు పరిమాణము

ద్రావకములు: 5మి॥లీ॥, 10మి॥లీ॥, 30 మి॥లీ॥, 450మి॥లీ॥;
టాబ్లెట్స్, పౌడర్స్ : 1 గ్రా॥, 2 గ్రా॥, 20 గ్రా॥;
ఇంకా- 4 ఔన్స్‌లు, 450 గ్రా॥ మఱియు పౌన్‌ల రూపములో లభ్యమగును.

మందు చీటి వ్రాయునపుడు- 1) మందు ఏ రూపములో కావాలో, 2) ఎంత పరిమాణములో కావాలో, 3) ఎంత పవర్ (పొటెన్సి)లో ఉండాలో జాగ్రత్తగా వ్రాయాలి. (ప్రిస్క్రిప్షన్ వ్రాయు విధానము- నాచే వ్రాయబడి, ఈ పుస్తక ప్రచురణ సంస్థ వారు ప్రచురించిన- "హోమియో వైద్యము" వెల : రూ॥ 15/-లను గ్రంథాన్ని చూడగలరు! —రచయిత)

# చికిత్సా విభాగము

## మానసిక కలతలు

వ్యాధి లక్షణాలు : ధనమునకు విలువ ఇచ్చు స్వభావము (సహజము కంటే ఎక్కువగా), ఆర్థిక పతనముకలుగునని అకారణముగా భయపడుట-

చికిత్స : కాల్కేరియా ఫ్లోర్-30 పొటెన్సీలో ప్రతి రోజూ రోజుకి 3 సార్లు, 3 మాత్రలు చొ॥న వాడాలి. (ఒక నెల కోర్స్ ఇవ్వవలెను)

వ్యా॥ ల॥ : దుఃఖము, విసుగుదల, ఆశాభంగము అనంతరము కలుగు బాధలు, తెలివి తక్కువ, మానసిక పరిశ్రమ చేయలేకపోవుట, అన్ని వ్యాధులలోను ఆందోళన హెచ్చు, గ్రహింపు శక్తి తక్కువ-

చికిత్స : కాల్కేరియా ఫాస్-6× పొటెన్సీలో ప్రతి రోజు 3 సార్లు 1 గ్రైన్ చొ॥న వాడాలి. ఇట్లు ఒక నెల వాడి తరువాత 12 పొటెన్సీలో ఒక నెల వాడాలి.

వ్యాధి లక్షణాలు : అన్ని విషయముల యందు అసంతృప్తి, పరధ్యానము, మారుచుండెడి స్వభావము, భయము, నిస్పృహ, జ్ఞాపక శక్తి అకస్మికముగా పోవుట-

చికిత్స : కాల్కేరియా సల్ఫ్-30 పొటెన్సీలో ప్రతి రోజు 3 సార్లు, 3 మాత్రలు చొ॥న కొంత కాలము వాడవలెను. తగ్గిపోతే ఆపాలి.

వ్యాధి లక్షణాలు : త్రాగు బోతుల యందు కలుగు వాగుడు, అతి వాగుడు, కోపము ఎక్కువ, నిర్లక్ష్యము, ఆశనశించుట, విసుగు చెందు స్వభావము, ఉన్మాద స్థితి, సరియగు మాటలు ప్రయోగించలేకపోవుట, తన భావములు వెల్లడించ లేకపోవుట, చిన్న విషయాలు కూడా పెద్దగా అనిపించుట, అయోమయస్థితి-

చికిత్స : ఫెర్రమ్‌ఫాస్-30 పొటెన్సీలో ప్రతి రోజు 3 సార్లు, 3

మాత్రలు చొ॥న వాడాలి. తగ్గని ఎడల- 200 పొటెన్సీలో వైవిక్ష ముగా ఒక నెలవాడాలి. దీనిని 3×లో వాడినని ద్రపట్టును. 200లో నిద్రపట్టు నట్లు చేయును.

వ్యాధి లక్షణాలు : ప్రతి దానికి ఉపవాసము చేయవలెనని కోరిక-

చికిత్స : కాలీమూర్-30 పొటెన్సీలో కొంతకాలము రోజుకి రెండు సార్లు చొ॥న వాడాలి.

వ్యాధి లక్షణాలు : ఆందోళన, అమిత భయము, లేనివి ఉన్నట్లు తలంచుట, ప్రతి విషయములో కీడుతలంచు స్వభావము. నిస్పృహ (తను చేయు పనులందు), ప్రజలలో కలసి ఉండుట కయిష్టము, మానసిక పనుల వలన మెదడు అలయుట, ఉత్సాహ శక్తులు క్రుంగుట, ముక్కోపము, అశాంతి, జ్ఞాపకశక్తి తగ్గుట; వ్రాయునపుడు, మాట్లాడునపుడు తప్పులు చేయుట (మాటలు లేక అక్షరములు)-

చికిత్స : కాలీఫాస్-30 పొటెన్సీలో ప్రతిరోజు 3 సార్లు 4మాత్రలు చొ॥న కొన్ని నెలలువాడవలెను. సుగుణము కనుపించినఆపవలెను.

వ్యాధి లక్షణాలు : పిరికి తనము, ఎప్పుడు హడావిడిగా ఉండుట-

చికిత్స : కాలీసల్ఫ్-30 పొటెన్సీలో ప్రతి రోజు 2సార్లు 4 మాత్రలు చొ॥న వాడాలి.

వ్యాధి లక్షణాలు : తల మొద్దుబారి నట్లుండి ఆలోచనలు తట్టవు, మానసిక పరిశ్రమ చేయుట కయిష్టము, వెక్కి వెక్కి దుఃఖించుచుండుట, తనలో తాను మాట్లాడుకొనుట. లేక మౌనము వహించుట-

చికిత్స : మెగ్నీషియాఫాస్-30 పొటెన్సీలో ప్రతి రోజు 3 సార్లు చొ॥న॥ ఒక నెల వాడాలి.

వ్యాధి లక్షణాలు : భవిష్యత్‌ను గూర్చి ఎల్లప్పుడు భయము చెందుట, ఎప్పుడూ ఏదో ఆలోచించుచుండుట [illegible]

# హోమియో వేదం -2

(ద్వాదశ


## Dr. కె.వి.యస్.డి.ప్రసాద్

D.H.M.S. (M.H.S. London)

వ్యవస్థాపకులు : హోమియో, ప్రకృతి, యోగపరిషత్;
ఫిజిషియన్ : చారిటబుల్ డిస్పెన్సరి,
చెరుకుపల్లి-522 309. ఫోన్ : 7232






Phone No. 23037




జనప్రియ పబ్లికేషన్స్

అగ్నికుల క్షత్రియుల వారి వీధి,
గంగానమ్మపేట, తెనాలి - 522 201.

# HOMOEO VYDYAM-2

By : Dr. K.V.N.D. Prasad, D.H.M.S.


| | |
|---|---|
| ముద్రణ : మార్చ్, 1995. | Edition : March, 1995. |
| అన్ని హక్కులు : జనప్రియ పబ్లికేషన్స్, తెనాలి వారివి. | All rights reserved by : Janapriya Publications-Tenali. |
| వెల : రూ॥ 15-00. | Price : Rs. 15-00. |
| ముఖ చిత్రము : ఎల్. రమేష్‌బాబు, విజయవాడ-2. | Cover Design : L. Ramesh Babu, Vijayawada-2. |
| ముద్రణ : పవన్ ప్రింటర్స్, తెనాలి-1. | Printed at : Pavan Printers, Tenali-1. |
| ముఖచిత్ర ముద్రణ : సౌందరమ్ ప్రింటర్స్, మద్రాస్-21. | Cover Printers : Soundaram Printers, Madras-21. |

ప్రతులకు : For Copies :

Janapriya Publications,
Agnikula Kshatriyula vari Street-II,
Ganganammapet, TENALI-522 201.

చికిత్స : నేట్రమ్‌మూర్-200, కాల్కేరియాఫాస్-200, కాలీఫాస్-200, ఫెర్రమ్‌ఫాస్-200 ఈ నాలుగు మందులు కలిపి రోజుకి రెండు సార్లు చొ॥న కొంతకాలము వాడవలెను.

---

**గమనిక :-** మానసిక వ్యాధులలో ఇంతకంటే పెద్ద పొటెన్సీలు వాడవలసి రావచ్చును కాని అనుభవ వైద్యుడే వాటిని వాడవలెను. మీకు దగ్గరలో ఉన్న హోమియోవైద్యుని సంప్రదించండి!

---

## శిరో వ్యాధులు-మందులు

వ్యాధి లక్షణాలు : నూతనముగా జనించిన శిశువు తలపై కలుగు కంతి, ఎముకలకు తగులు దెబ్బలు, వికారముతో ఉండు తలనొప్పి; గట్టిగా జాయివలె ఉండు కంతులు, రక్తపు కంతులు, సెగ్గడలు-

చికిత్స : కాల్కేరియాఫ్లోర్-12× లో ప్రతిరోజు 4 సార్లు సారికి 1 గ్రైన్‌చొ॥న తగ్గువరకు వాడవలెను. (పౌడర్, టాబ్లెట్స్ రూపములో బాగుగా పనిచేయును.)

వ్యా॥ ల॥ : వృద్ధాప్యమునందు కలుగు వ్యాధులకు, తుమ్ముట వలన తలనొప్పి తగ్గుట, తల చల్లగా ఉండుట; పండ్లు వచ్చు సమయమునందు వచ్చు తలనొప్పి, మాడునొప్పి. కడుపులో గ్యాస్ వుండుట వలన కలుగు తలనొప్పి, బ్రహ్మరంధ్రము (మాడు) పూడకపోవుట లేక పలుచగా ఉండుట, తల, వెంట్రుకలు రాలుట, తల దురద, కురుపులు-

చికిత్స : కాల్కేరియా ఫాస్-12×లో పౌడర్‌గాని, టాబ్లెట్స్‌గాని ప్రతిరోజూ రోజుకి 3 సార్లు చొ॥న తగ్గే వరకు వాడాలి.

వ్యా॥ ల॥ : చిన్న పిల్లల యందు అంటుకట్టి, రసితో కూడిన కురుపులు; చీముగాని. రసిగాని ఉండుట; తలచుట్టూ నొప్పి, చుండు, వెంట్రుకలు రాలిపోవుట-

చికిత్స : కాల్కేరియాసల్ఫ్-30 ప్రతిరోజు 3 పూటలా సారికి 3 మాత్రలు చొ॥న తగ్గు వరకు వాడవలెను.

వ్యాధిలక్షణాలు : తాకిచూస్తే- తల పచ్చిపుండుగా ఉండుట, రక్తాధిక్యతచే తలనొప్పి, ముక్కునుండి రక్తస్రావమైన- తలనొప్పి తగ్గుట, తీవ్రమైన తలనొప్పి, శిరోజాలను దువ్వెనతో దువ్వుట వలన కూడా నొప్పి, ఎండ వేడిమిచే కలుగు తలనొప్పి, ముఖము ఎర్రబడుట, తలనొప్పితో చూపు కనిపించక పోవుట-

చికిత్స : ఫెర్రమ్‌ఫాస్-30 లో ప్రతిరోజు 3 సార్లు వాడాలి. నొప్పులు ఎక్కువగా ఉన్నగంటకు 3మాత్రలు చొ॥న గంట-గంటకు వాడాలి.

వ్యా॥ల॥ : వాంతులతో కూడిన తలనొప్పి, తెల్ల తెమడ లేక నాలుకపై తెల్లని పూత ఏర్పడి తలనొప్పి వచ్చుట అజీర్ణము వలన తలనొప్పి, చుండు, రసికారు చర్మవ్యాధి-

చికిత్స : కాలీమూర్-30లో ప్రతిరోజు 3 సార్లు సారికి 3 మాత్రలు చొప్పున వాడవలెను. నొప్పి తీవ్రముగా ఉన్న ప్రతి 15 ని॥లకు ఒక మోతాదు వాడవచ్చును. దీనితో C.S.,F.P. కలిపి వాడిన మంచిది.

వ్యా॥ల॥ : లేచునపుడు, పరుండునపుడు, నిలబడునపుడు, కూర్చున్నపుడు పైకి చూచుటవలన కలుగు- తలత్రిప్పు,తలదిమ్ము; మెదడునందు రక్తక్షీణత వలన కలుగు- అలసట, తలనొప్పి; నరముల బలహీనత వలన- విద్యార్థులు, డాక్టర్స్, లాయర్స్, ఉపాధ్యాయులు- మొ॥గు మానసిక శ్రమ చేయు వారియందు కలుగు తలనొప్పి; స్త్రీలయందు ఋతు సమయములో తలనొప్పి, శిరో కదలిక వలన తలనొప్పి-

చికిత్స : కాలీఫాస్-6×లేక 12×లో ప్రతిరోజు రోజుకి 3 సార్లు వాడాలి. తగ్గని పక్షమున 30 పొటెన్సిలో ప్రతిరోజు 3సార్లు వాడాలి.

వ్యాధి లక్షణాలు : వెంట్రుకలు రాలిపోవుచుండుట, అక్కడక్కడ బట్టతల ఏర్పడుట, కీళ్ళవాత సంబంధమైన తలనొప్పి, తలపై చేప పొలుసులవలె పొట్టు వచ్చుట; తేమగా, జిగురుగా ఉండుట; చుండు, తల వెచ్చగా నుండుట-

చికిత్స : కాలీసల్ఫ్-6×లో ప్రతిరోజు రోజుకి 3 సార్లు కొంత కాలము వాడవలెను. దీనితో నేట్రమ్‌మూర్-6×కూడా వాడవచ్చును.

వ్యా॥ల॥ : తలనొప్పి, స్పృహ లేకుండా వచ్చు పోర్లు లేక ఫిట్స్, మెదడు వ్యాధులు; నొప్పులు త్వరితముగా తగ్గుట, తీవ్రముగా ఉండుట; విద్యార్థులకు, మానసిక పరిశ్రమ చేయువారికి కలుగు తల-నరముల బాధ; ఈ బాధ శిరస్సుకు వెనుక నుండి-వెన్నుకు వ్యాపించి, భుజముల మధ్యకు పోవుట; తలపై చర్మము గట్టిగా ఉండుట, తల తిరుగుట; తలను ముందుకుగాని, ప్రక్కలకుగాని త్రిప్పుటచే నొప్పి; మెదడు భాగమున నొప్పి-

చికిత్స : మెగ్నీషియాఫాస్-6×లేక 12×లో ప్రతిరోజు 3 సార్లు వాడాలి. దీనితో కాలీఫాస్-6× లేక 12× లో వాడిన త్వరగా ఫలితములు ఉండును.

వ్యా॥ల॥ : నుదురు, కణతల యందు తలనొప్పి; ఇది నిద్రలో తగ్గుట; కన్నీరుకారు స్వభావము, నిద్రమత్తు, సుఖము తెలియని నిద్రవలన కలుగు తలనొప్పి, మలబద్దకముతో నుండు తలనొప్పి; విద్యార్థులకు, స్త్రీలకు ఋతు సమయములో కలుగు తలనొప్పి, వడదెబ్బ, సూర్యతాపముచే కలుగు బాధలు, వెంట్రుకలు రాలిపోవుట, పార్శ్వపు తలనొప్పులు-

చికిత్స : నేట్రమ్‌మూర్-30లో ప్రతిరోజు 3 పూటలా సారికి 3 మాత్రలు చొ॥న తగ్గువరకు వాడవలెను. మలబద్దకముతో ఉన్న కేస్‌లందు- సైలీషియా 30తో వాడవలెను.

వ్యా॥ల॥ : ఋతువుకి- ముందు, తరువాత కలుగు తలనొప్పి మాడునొప్పి (నడినెత్తి నొప్పి), ఉదయము లేవగానే ఉండు తల; నొప్పి- వెనుక గాని, నుదురు యందుగాని ఉండుట; పుల్లని త్రేపులు లేక ద్రవపు వాంతితో కూడిన తలనొప్పి-

చికిత్స : నేట్రమ్‌ఫాస్-6×లేక 12×లో ప్రతిరోజు 3 సార్లు చొ॥న తగ్గువరకు వాడవలెను. దీనితో కాలిమూర్-6× లేక 12×లో వాడిన మంచి ఫలితముండును.

వ్యాధి లక్షణాలు: పైత్యపుతలనొప్పి, తలత్రిప్పు, నడినెత్తిన నొప్పి, చేదువాంతి, చేదు రుచితో కూడిన బాధలు, తలకు దెబ్బలు తగులుటచే కలుగు చెడు ఫలితములు, నడినెత్తిన మంట, మెదడు లూజ్‌గా ఉన్నట్లు భావన; తల, చర్మము- దురద,బాధ, నొప్పులు-
చికిత్స: నేట్రమ్‌సల్ఫ్-30లో ప్రతిరోజు 3పూటలాపూటకి3 మాత్రలు చొ॥న తగ్గేవఱకు వాడవలెను. దీనితో నేట్రమ్‌ఫాస్-30 వాడిన మంచిది. కపాల ఎముక, దవడ ఎముక కలియుచోట వచ్చు నొప్పికి- కాల్కేరియాఫాస్-6×లో వాడవలెను.

వ్యా॥ల॥ : రోగి- ముందుకు గాని, వెనుకకు గాని పడిపోతున్నట్లు ఉండుట; అంతర్గత కారణాల వలన కలుగు తలత్రిప్పు, మెడ వెనుక భాగము నుండి నడినెత్తి వఱకు నొప్పి (కుడివైపు అధికము); అలసట వలన, వెలుగువలన,చదువుట వలన అధికమైన తలనొప్పి; ఇది వెచ్చదనము వలన తగ్గుట; చీముతో కూడిన కుఱుపులు, తలపై ఎక్కువ చెమట, తలకు గుడ్డను చుట్టుకొనుట వలన బాధలు తగ్గుట, బ్రహ్మరంధ్రము పెద్దదిగా ఉండి- తెఱచుకొని ఉండుట; దుర్వాసన గల- చీము, రసి, చెమట; తల వెంట్రుకలు రాలుట, వెంట్రుక కుదుళ్ళ వాపు-
చికిత్స : సైలీషియా-30లో ప్రతిరోజు రోజుకి 3 సార్లు 3మాత్రలు చొ॥న వాడవలెను. కుఱుపులలో 200 పొటెన్సిలో వాడవలెను. దీనిని నేట్రమ్‌మూర్-30, కాల్కేరియాఫాస్-30,కాల్కేరియా సల్ఫ్-30 లతో కలిపి వాడిన బాగా పని చేయును. బాధలు తగ్గువఱకు వాడవలెను.

## నేత్ర వ్యాధులు-మందులు

వ్యాధి లక్షణాలు : కనురెప్పలపై కుఱుపులు, కనుగ్రుడ్డు తెల్లని భాగముపై మచ్చలు, కండ్ల కలక, కంటితో పనులు చేయుట వలన (చదువుట, వ్రాయుట, కుట్టుట మొ॥వి) చూపు అలుముకుపోయినట్లు ఉండుట, కేటరాక్ట్ (కంటిలో తెల్లటి పొర)-
చికిత్స : కాల్కేరియాఫ్లోర్-30లో ప్రతి రోజు రోజుకి 3 మాత్రలు చొ॥న వాడవలెను. దీనితో సైలీషియా-30 లో కూడా వాడాలి.

వ్యాధి లక్షణాలు : కనురెప్పలు శక్తి లేక వాలిపోవుట, అంధత్వము; వెలుగును, గ్యాస్ లైట్స్‌ను చూడలేకపోవుట; తెల్లగ్రుడ్డు వాపు, చిన్నపిల్లలలో పుట్టుక నుండి మసక-

చికిత్స : కాల్కేరియాఫాస్-6 × లో ప్రతిరోజు 3 సార్లు వాడాలి. తగ్గని ఎడల 12 ×లో వాడాలి. దీనితో మెగ్నిషియాఫాస్-6 ×లో వాడాలి.

వ్యా॥ల॥ : కండ్ల కలక, కంటిలో వ్రణము, పసుపుపచ్చని స్రావము, కంటిలో చీము కూడుట, రెటీనా వాపు, కంటిలో ఏదో అన్యపదార్థము ఉన్నట్లు ఉండుట, కంటికి గాయము తగిలిన తరువాత కలుగు చెడు లక్షణములు, కనురెప్పలు అదురుట, కంటి ముందు దృశ్యాలు సగమే కనుపించుట-

చికిత్స : కాల్కేరియాసల్ఫ్-200లో ప్రతిరోజు 3 సార్లు సారికి 3 మాత్రలు చొ॥న వాడాలి. దీనితో సైలీషియా-200, ఫెర్రమ్ ఫాస్-30 కలిపి వాడాలి.

వ్యాధి లక్షణాలు : కళ్ళలో ఎఱుపు, నీరు కారుట, మంట, తీవ్ర రక్తాధిక్యత, కండ్ల కలక, కన్నులు వాపు, కన్నులయందు ఇసుక ఉన్నట్లుబాధ, వెలుగు చూడలేకపోవుట, కన్నుల క్రింద (క్రింద రెప్పల క్రింద భాగములో) నల్లని ఛాయలు ఏర్పడుట-

చికిత్స : ఫెర్రమ్‌ఫాస్-30లో ప్రతిరోజూ 3సార్లు సారికి 3మాత్రలు చొ॥న వాడాలి. బాధ ఎక్కువగా ఉంటే .. 3 గం॥లకు ఒక డోస్ చొ॥న వాడాలి. దీనితో కాల్కేరియాసల్ఫ్-30 వాడవచ్చును.

వ్యా॥ల॥ : కన్నుల నుండి తెల్లని అమ్లము (పుసి) వచ్చుట, కళ్ళలో నీటి పొక్కులు, తెల్లని పొర. కనురెప్పల యందు సూదుల వంటి పొక్కులు, ట్రకోమ-

చికిత్స : కాలీమూర్-30లో ప్రతిరోజూ 3సార్లు సారికి 3మాత్రలు చొ॥న వాడాలి. దీనితో కాల్కేరియాఫ్లోర్-30 వాడాలి.

వ్యా॥ల॥: నీరస దృష్టి, మెల్ల, డిఫ్తీరియా అనంతరము కలుగు కంటి వ్యాధి; కంటికండరములు, నరములు దుర్బలముగా ఉండుట;

కనురెప్పలు అదురుట, కన్నులయందు నల్లని మచ్చలు; కన్నులు గుంటలుగా పీక్కుపోయి, ముఖము కళావిహీనముగా ఉండుట-
చికిత్స : కాలీఫాస్-6× లేక 12×లో ప్రతిరోజూ 3సార్లు వాడాలి. దీనితో మెగ్నీషియాఫాస్-6× లేక 12× కూడా వాడాలి.

వ్యాధిలక్షణాలు : కంటిలోని లెన్స్(అద్దము)నకు పారదర్శకత్వము పోవుట, పచ్చని పుసులు, కన్నుల యందు అమత్వకుష్ఠ (కంజెక్టివ్) వాపు లేక చీము పట్టుట (నూతన శిశువుకు ఇట్లు కలుగును),కార్నియా క్రింద కురుపు, దీని స్రావము పచ్చగా ఉండుట-
**చికిత్స : కాలీసల్ఫ్-30 ప్రతిరోజూ 3 సార్లు వాడాలి. దీనితో** కాల్కేరియాసల్ఫ్-30 వాడవలెను.

వ్యా॥ల॥ : లేని రంగులు కనిపించు చుండుట, వస్తువులు రెండుగా కనిపించుట; కనుపాపలు సంకోచము చెందుట; కంటి నుండి మెదడుకు పోవు నరము దెబ్బతినుట వలన చూపుపోవుట, "రెటీనా"కి దెబ్బ వలన చూపు తగ్గుట, కనురెప్పలు క్రిందికి వాలిపోవుట, కనురెప్పలు అదరుట; కంటి నరముల బలహీనత వలన చదువుట కష్టముగా- ఉన్నపుడు-
చికిత్స : మెగ్నీషియాఫాస్-6× లేక 12×లో ప్రతిరోజూ3 సార్లు వాడాలి. దీనితో కాలీఫాస్-6× లేక 12×లో వాడిన మంచిది.

వ్యా॥ల॥: చూపు తెరకట్టినట్లు ఉండుట, చదువునపుడుఅక్షరములు అలుక్కు పోయినట్లు ఉండుట, ఎండలో- కంటి బాధలు, ఉద్రేకము చెంది కన్నీటి గ్రంథి నుండి కన్నీరు కారు చుండుట; దురద, మంట.కన్నులు పొడియారిపోయినట్లుఉండుట; కనురెప్పలు వాచుట, రాపిడి కలిగించు కన్నీరు, నీటి పొక్కులు, కన్నులు అలసినటచే చూపు నీరసముగా ఉండుట; ఈ బాధలన్నీ సూర్యోదయముతో వచ్చి, సూర్యాస్తమయముతో పోవుట-
చికిత్స : నేట్రమ్మూర్-30లో ప్రతిరోజూ 3సార్లుసారికి3మాత్రలు చొ॥న వాడాలి. దీనితో కాలీఫాస్-30, మెగ్నీషియాఫాస్-30 కూడా వాడిన మంచి ఫలితములు ఇచ్చును.

వ్యాధి లక్షణాలు : బంగారువన్నె గల పుసులు, కనుఱెప్పలు ఉదయము అంటుకొనుట; వేడిగా కన్నీరు స్రవించుట, ప్రేగులలో క్రిములు ఉండుటచే కలుగు మెల్ల-

చికిత్స : నేట్రమ్‌ఫాస్-30లో ప్రతిరోజు 3సారు సారికి 3మాత్రలు చొ॥న వాడాలి దీనితో మెగ్నిషియాఫాస్-30 కూడా వాడుట మంచిది.

వ్యాధి లక్షణాలు : కన్నులు పచ్చబడుట, కన్నులయందు కొయ్యకండలు పెరుగుట, చీము ఆకుపచ్చగా వచ్చుట, కన్నులు అంటుకొనుట, వెలుతురును చూడలేక పోవుట-

చికిత్స : నేట్రమ్‌సల్ఫ్-6×లేక 12×లో ప్రతిరోజూ 3 సార్లు వాడాలి. దీనితో నేట్రమ్‌ఫాస్-6× లేక 12×, కాలీమూర్-6× లేక 12×లో వాడాలి.

వ్యా॥ల॥ : కన్నుల యందు కలుగు- లోతైన రంధ్రము, వ్రణము, చీము కారుట, పెగ్గడలు, కొలుకుపుండ్లు, కంటికొలుకుల యందు కురుపులు, కండ్లు మసక, స్టైయ్ (కంటి ఱెప్పల అంచుల యందు లేచు కురుపులు)-

చికిత్స : సైలీషియా-200 లో ప్రతిరోజూ రోజుకు 3సార్లు చొ॥న తగ్గువరకు వాడాలి. దీనితో C.S.-200 కూడా వాడాలి.

## చెవి, ముక్కు వ్యాధులు-మందులు

వ్యాధి లక్షణములు : చెవిలో గింగుర్లు, శిరస్సునందు జలుబు, తుమ్మవలయునని కోరిక ఉండునుగానీ తుమ్ము రాదు. ముక్కులు, దిబ్బడ; పడిసెము, ముక్కు ఎముక వ్యాధులు, ఎడినాయిడ్స్-

చికిత్స : కాల్కేరియాఫ్లోర్-6×లేక 12×లో ప్రతిరోజూ 3 సార్లు సారికి 3 మాత్రలు చొ॥న వాడాలి.

వ్యా॥ల॥ : వెలుపల చెవి చల్లగా ఉండుట, కీళ్ళవాత సంబంధమైన చెవి ఎముకలనొప్పి, చెవి దగ్గఱ గ్రంథులవాపు, దీనికి న్యూ-

గొంతునొప్పి, చెవిదిబ్బడ, చెవుడు, రోగి క్షీణించిపోవు వ్యాధిలో చెవి బాధలు; చల్లనిగాలియందు నాసికనుండి స్రావము కలిగి, వెచ్చనిగాలియందు ఆగుట;దీర్ఘ జలుబు-తుమ్ములు,ముక్కులో కంతి-
చికిత్స : కాల్కేరియాఫాస్-6×లేక 12×లో ప్రతిరోజూ 3 సార్లు వాడాలి. దీనితో కాల్కేరియాఫ్లోర్-6×లేక 12×లో తగ్గేవఱకు వాడాలి.

వ్యాధి లక్షణాలు: చెవినుండి చీము కాఱుటచేకలుగు చెవుడు, చెవినొప్పి, ముక్కునొప్పి, రక్తస్రావము,ముక్కులో పొక్కులుకట్టి-పట్టుకొన్నట్లుగా ముక్కునొప్పి, ముక్కు దిబ్బడవేయుట-
చికిత్స : కాల్కేరియాసల్ఫ్-30 లేక 200లో ప్రతిరోజూ 3 సార్లు సారికి 3 మాత్రలు చొ॥న వాడాలి. దీనితో సైలీషియ-30 లేక 200 లో ప్రతిరోజూ వాడాలి. తగ్గితే ఆపవలెను.

వ్యా॥ల॥ : శబ్దములను భరించలేకపోవుట;చల్లదనము, తేమ వలన చెవిపోటు; రక్తపోటు వలన చెవిపోటు లేక చెవిలో శబ్దము, చెవి మొదట్లో- వాపు; జలుబు, రక్తస్రావము,ఎఱ్ఱని రక్తస్రావము, చల్లని గాలి వలన రక్తము లేక జలుబు స్రవించుట-
చికిత్స : ఫెర్రమ్‌ఫాస్-6× లేక12×లో ఒకేరోజు 4లేక 5 సార్లు వాడాలి. దీనితో కాలీమూర్-6× లేక 12×లో వాడవలెను.

వా॥ల॥ : చెవుడు, మధ్యచెవివాపు, చెవి నుండి గొంతుకు పోవు నాళము మూసుకుపోవుట,చెవినుండి తెల్లని స్రావమువచ్చుట, జలుబు, ముక్కునుండి తెల్లని స్రావము-
చికిత్స : కాలీమూర్-6×లేక 12×లో రోజుకి 3 లేక 4 సార్లు వాడాలి. దీనితో ఫెర్రమ్‌ఫాస్-6× లేక 12× కూడా వాడాలి.

వ్యాధి లక్షణములు : నరముల బలహీనతచే కలుగుచెవుడు, దుర్వాసనతో కూడిన స్రావము, చెవిలో "హుూం"కార శబ్దము; ముక్కునుండి దుర్వాసనతో కూడిన స్రావము వచ్చుట, తుమ్ములు, ముక్కులో- పుండ్లు, ముక్కుతో మాట్లాడవలసి వచ్చుట-

చికిత్స : కాలీఫాస్-6× లేక 12×లో ప్రతిరోజూ రోజుకి 3 సార్లు చొ॥న తగ్గువఱకు వాడాలి. దీనితో మెగ్నిషియాఫాస్-6× లేక 12× వాడాలి.

వ్యాధి లక్షణాలు : జలుబుతో కూడిన చెవుడు, చెవి నుండి పచ్చని స్రావము, మాస్టాయిడ్ ఎముకనందు నొప్పి;చెవిలో వ్రణాలు కంతులు; దుర్వాసనతో కూడిన చీము, జలుబు, పచ్చని పడిసెము దీర్ఘ జలుబులు, వాసన తెలియక పోవుట, దురద-

చికిత్స : కాలీసల్ఫ-6 × లేక 12 × లో ప్రతిదినమూ 3 సార్లు సారికి 3 మాత్రలుచొప్పున తగ్గేవఱకు వాడాలి.

వ్యా॥ల॥: చెవుడు;మెదడులేకనాడీమండల నీరసముచే కలుగు చెవుడు, చెవి పోటు, రకరకాల చెవిపోట్లు: జలుబు-పడిసెముతో వాసన గ్రహించు (ఘ్రాణశక్తి)శక్తి లోపించుట, ముక్కుదిబ్బడ-

చికిత్స : మెగ్నిషియాఫాస్-6× లేక 12 × లో ప్రతిరోజూ 3 సార్లు వాడాలి. నొప్పి ఎక్కువగా వుంటే తగ్గేవఱకు ప్రతి గంటకు 1 డోస్ చొ॥న వాడాలి. దీనితో కాలీఫాస్-6×లేక 12× వాడాలి.

వ్యా॥ల॥ : నమలుచున్నట్లుగా చెవులయందు శబ్దము;దురద, చెవినుండి నీటివంటి స్రావము; వాసన, రుచి తెలియకపోవుట; రక్తక్షీణతతో కలుగు వ్యాధులు, అధిక తుమ్ములు, వేసవిలో చేయు జలుబు, నీటివంటి స్రావము, చెవిమంట-

చికిత్స : నేట్రమ్మూర్-30లో ప్రతిరోజు రోజుకి 3 లేక 4 సార్లు తగ్గేవఱకు వాడాలి.

వ్యా॥ల॥ : జీర్ణకోశలక్షణాలతోనుండు చెవివాపు చెవిబాధలు, దురద, చెవిలో హోరు; ముక్కు గిల్లుకొనుచుండుట, ప్రేగులందు క్రిములుండుటచే- ముక్కు దురద, జలుబు-

చికిత్స : నేట్రమ్ఫాస్-30 లేక 200 లో ప్రతి రోజు 3 సార్లు సారికి 3 మాత్రలు చొ॥న॥ వాడాలి.

వ్యా॥ల॥ : చెవి నుండి ఏదో బయటకు వచ్చుచున్నట్లు పోటు, ఇది తేమ వాతావరణ మందు అధికమగుట, గంట మ్రోగి

నట్లు శబ్దము. ఋతు సమయము నందు- ముక్కు నుండి రక్త స్రావము; తేమ వాతావరణము వలనజలుబు;ముక్కుదిబ్బడ,దురద, నీటివంటి స్రావము; శీతాకాలములో, వర్షాకాలములో కలుగు జలుబు (వేసవిలో జలుబుకు N.M.,F.P. వాడాలి)-

చికిత్స : నేట్రమ్‌సల్ఫ్-30 లో ప్రతి 3 గం॥లకు 1 డోస్ చొ॥న జలుబు తగ్గేవఱకు వాడాలి. దీర్ఘవ్యాధి ఐతే... ప్రతిరోజూ 3 సార్లు వాడాలి.

వ్యాధి లక్షణాలు : శబ్దము సహించలేకపోవుట,చీము స్రవించుట;దుర్వాసన, రసికారుట, చెవిలో పుండ్లు, చెవుడు, తుమ్ములు; దీర్ఘ కాలిక రొంప; పుండ్లు, వాసన తెలియకపోవుట, మంట, రాపిడి కలిగించు చీము లేక స్రావము; ముక్కు, చెవులందు కలుగు చర్మ వ్యాధి; రసిక, దురద-

చికిత్స : సైలీషియా-30 లేక 200 లో ప్రతిరోజూ 3 సార్లు తగ్గేవఱకు వాడాలి. దీనితో కాల్కేరియాసల్ఫ్-30 లేక 200 మఱియు ఫెర్రమ్‌ఫాస్-30 లేక 200 లో వాడాలి. నొప్పిగా వుంటే .... మెగ్నీషియాఫాస్-30 వాడాలి.

## నోరు, గొంతు వ్యాధులు-మందులు

వ్యాధి లక్షణాలు : పంటినొప్పి లేక చిగురువాపుతో దౌడ వాచి, గట్టిగా ఉండుట, దౌడవాపుతో వ్రణము- ఈ వాపులు అన్నీ రాయివలె గట్టిగా ఉండుట; నోటి మూలలు పగులుట లేక పుండ్లు; పుట్టుక నుండి వంశాను గతముగా కలిగిన ('సిఫిలిస్'చే)- నోటిలో లేక గొంతులో పుండ్లు; నాలుకపై చాఱలు-చాఱలుగా పగుళ్ళు లేక పుండ్లు; దంతాలు ఆలస్యముగా వచ్చుట, పళ్ళపై గల ఎనామిల్ (పింగాణి పదార్థము) లోపించుట. పండ్లు తేలికగా కదలి ఊగులాడుట,చిగుళ్ళవాపు; రక్తస్రావము, డిఫ్తీరియా; కొండనాలుక పెద్దది అగుట, దీని వలన దగ్గు వచ్చుట; టాన్సిల్స్‌వాపు లేక నొప్పి-

చికిత్స : కాల్కేరియాఫ్లోర్-6× లేక 12 × లో ప్రతిరోజూ 3 సార్లు సారికి 3 మాత్రలు చొ॥న వాడాలి. వ్రణములుంటే ... దీనితో సైలీషియా 200 వాడాలి.

వ్యాధి లక్షణాలు : కన్యల ముఖము మీద వచ్చే మొటిమలు వంటి పొక్కులు, ముఖము ఎప్పుడూ జిడ్డు కారుచుండుట, గ్రంథులు ఉబ్బుట, నోటిలో అసహ్యకరమైన రుచి, పై పెదవి ఉబ్బరించుట, టాన్సిల్స్ వలన నోరుతెరుచుట కష్టము, తలనొప్పితో నోటి చేదు, పిల్లల పళ్ళు వచ్చు కాలములో కలుగు బాధలు, పళ్ళు మెల్లగా పెరుగుట, పళ్ళు చెడిపోవుట: ఇగుళ్ళనొప్పి లేక వాపు; గొంతుబొంగురు, గ్రంథుల వాపు, గుటక వేయునపుడు గొంతు నొప్పి మాట్లాడునపుడు గొంతు సవరించు కొనవలసి వచ్చుట, ఎక్కువగా మాట్లాడు వారికి కలుగు గొంతు బొంగురు లేక నొప్పి; గొంతు నందు ఉత్తిగుటక వేయునపుడు కలుగునొప్పి, గొంతుక నుండి జిగురువంటి స్రావము (జలుబుతో) వచ్చుట; టాన్సిల్స్ వాపు లేక నొప్పితో చెవి నొప్పిగా ఉండుట-

చికిత్స : కాల్కేరియాఫాస్-6×లేక 12×లో ప్రతిరోజూ రోజుకి 3 సార్లు చొ॥న వాడాలి· దీనితో కాల్కేరియాఫ్లోర్-6× లేక 12×లో వాడాలి. వ్యాధి తీవ్రతనుబట్టి గంటకు 1డోస చొ॥న వాడవచ్చును. తరువాత 30 పొటెన్సీలో కూడా వాడవచ్చును.

వ్యా॥ల॥ : దవడలపై వ్రణములు, నోటి నిండా పుండ్లు; నాలుక లేక గొంతు మంట, పుల్లనిరుచి, కీళ్ళవాత సంబంధమైన పళ్ళతీపు, లేక నొప్పి; ఇగుళ్ళకు చీము పట్టుట, రక్తస్రావము; గొంతులో పుండ్లు ఏర్పడి- చీము స్రవించుచుండుట, టాన్సిల్స్ చీము పట్టి బాధ కలిగించుట; డిఫ్తీరియా, చీము స్రవించు "క్వీన్జీ" అను వ్యాధి-

చికిత్స : కాల్కేరియాసల్ఫ్-30 లేక 200లో ప్రతిరోజూ రోజుకి 3సార్లు చొ॥న తగ్గేవఱకు వాడాలి. దీనితో సైలీషియా-200 వాడిన త్వరగా గుణము కనిపించును.

వ్యాధి లక్షణాలు : ఇగుళ్ళ నుండి రక్తస్రావము, ఇగుళ్ళు మెత్తగా దూదిపింజలవలెఉండుట, నాలుక ఎఱ్ఱగా నుండి వాపు; వేడి ఆహార పదార్థముల వలన పళ్ళు తీపు కలిగి, చల్లని పదార్థముల వలన తగ్గుట; గొంతు ఎఱ్ఱగా వుండి వాపు, గొంతు పొడి ఆఱిపోయి... వేడిగా ఉండుట; టాన్సిల్స్ ఎఱ్ఱగా వాచి యుండుట, గ్రంథుల వాపు, డిఫ్తీరియా ప్రథమ దశ (గాయకులకు ఉపయోగపడు మంచి చికిత్స) గొంతు నుండి ఎఱ్ఱని రక్తస్రావము-

చికిత్స : ఫెర్రమ్‌ఫాస్-6× లేక 12 × లో ప్రతిరోజూ రోజుకి 3 లేక 4 సార్లు వాడవచ్చును. బాధ ఎక్కువగా వుంటే... గంటకి 1 డోస్ చొ॥న వాడవచ్చును.

వ్యా॥ల॥ నోటిలో తెల్లని నూకల వంటి పొక్కులు, తినివేయు చుండు పుండ్లు; దవడ లేక మెడవద్ద గ్రంథులు ఉబ్బుట; నాలుకపై తెల్లని పూత, డిఫ్తీరియా(గవదలు వాపుకి,ఎడినాయిడ్స్‌కి టాన్సిల్స్ వంటివి ఉబ్బగానే మందు వాడవలెను); గొంతు వ్యాధులు; నీటిని కూడా త్రాగలేకపోవుట, వాటి వలన గొంతు నొప్పి-

చికిత్స : కాలీమూర్-6 × లేక 12× లో ప్రతిరోజు 3 సార్లు వాడాలి. దీనితో ఫెర్రమ్‌ఫాస్-6× లేక 12 × లో వాడాలి. దీనిని ఒక గ్లాస్ గోరు వెచ్చని నీటిలో కలిపి పుక్కిలించిన మంచిది.

వ్యా॥ల॥ : పై పండ్ల నుండి చెవిలోనికి పొడుచునొప్పి, పెదవుల చర్మము పైన- పొలుసు వుండుట, పొక్కు-కట్టు కురు పులు, నోటి దుర్వాసన, లాలాజలము అధికముగా వచ్చుట, నాలుక నొప్పి; పుప్పి పండ్లు లేక ఇగుళ్ళు నొప్పులు, రక్తస్రావము; పంటి నొప్పితో నుదురు నొప్పి ఉండుట; పెద్దగా మాట్లాడ లేకపోవుట, మాట అస్పష్టముగా ఉండుట, ఇగుళ్ళు వెనకకు పోవుట, నిద్రలో పళ్ళు కొఱుక్కొనుట,స్వరముపోవుట, ముక్కుతోమాట్లాడుట;గొంతు లేక స్వరపేటిక మఱియు శరీరము నందు అవయవములకు గలుగు పక్షవాతము-

చికిత్స : కాలీఫాస్-6+ లేక 12×లో ప్రతిరోజూ 3సార్లు వాడాలి. దీనితో మెగ్నీషియాఫాస్-6× లేక 12×లో వాడాలి. పక్షవాతము నందు 30, 200 పొటెన్సీలలో కూడా వాడవలసిరావచ్చును. ఆపై పొటెన్సీలు అనుభవము గలిగిన వారి సారథ్యములో వాడాలి.

వ్యా॥ల॥ : క్రింద పెదవివాపు, నోటిలోని పై పొర ఊడుట, నాలుకకు రుచి తెలియని స్థితి, నోరు వెచ్చగా ఉండుట; సాయంత్రము పూట, పంటినొప్పి; గొంతు పొడిగా ఉండి- నొక్కినట్లుగా నొప్పి; టాన్సిల్స్‌వాపుతో మ్రింగుట కష్టమగుట; ఎడినాయిడ్స్ ఆపరేషన్ జరిగిన తరువాత- నోటితో గాలిపీల్చవలసివచ్చుట లేక చెడు లక్షణములకు-

చికిత్స : కాలీసల్ఫ్-12×లేక 30×లో ప్రతిరోజు3సార్లు వాడాలి. తగ్గితే ఆపాలి.

వ్యా॥ల॥ : మెఱపు తీగవలె- ఆకస్మికముగా వచ్చి, ఆకస్మికముగా తగ్గు నొప్పులు; నత్తి, అంకెళ్ళు బిగుసుకు పోవుట, పెదవుల మూలల యందు పగుళ్ళు; చన్నీటి వలన లేక చల్లగాలి వలన- పళ్ళ తీపు, పోటు; వేడి లేక వేడి నీటి వలన ఉపశమనము కలుగుట, పుప్పిపళ్ళ తీపు, పోటు; చిన్నపిల్లలకు పళ్ళు వచ్చునపుడు కలుగు బాధలు, మెడయందలి థైరాయిడ్ గ్లాండ్ పెద్దది అగుట; తల వెనుక భాగము నొప్పితో గుటక వేయుట కష్టమగుట-

చికిత్స : మెగ్నీషియాఫాస్-6 × లేక 12×లో ప్రతిరోజూ రోజుకి 3 సార్లు చొ॥న వాడాలి. దీనితో కాలీఫాస్-6× లేక 12×లోనూ, ఫెర్రమ్‌ఫాస్-6× లేక 12×లోను వాడాలి. పెదవుల మూలల పగుళ్ళకు కాల్కేరియాఫ్లోర్-6× లేక 12× తో వాడవలెను.

వా॥ల॥ : క్వినైన్ వాడినపుడు చెడు లక్షణములు కలుగుట, భుజించినపుడు చెమట, ముత్యము వలెనీటి వంటి ద్రవవు పొక్కులు వచ్చుట; లాలాజలము ఉప్పగా ఉండుట, కొండనాలుక వాచుట లేక దిగజాఱుట, నోటి మూలలు పగిలి మంటగా ఉండుట, పెద

వుల పగుళ్ళు, గొంతు జలుబు, గడ్డము మీద చర్మవ్యాధి, రుచి తెలియక పోవుట, చిన్న పిల్లలు- మాటలు ఆలశ్యముగా నేర్చు కొనుట, నాలుకపై వెంట్రుకలు ఉన్నట్లు భావన; నాలుక-గొంతు పొడి ఆరిపోయినట్లు ఉండుట; దాహము, లాలాజలము ఎక్కువగా ఊరుచుండుట; చొంగ, రక్తస్రావము, ఇగుళ్ళు వదులై పళ్ళు కదు లుట; పిల్లలకు గానీ, పెద్దలకు గానీ- మెడ శుష్కించుట; థైరా యిడ్- మొదలగు అన్ని గ్రంథుల వాపు, గవదల వాపు, కొండ నాలుక వ్రేలాడుట లేక వాపు, నాలుక ఉప్పని రుచితో ఉండుట-
చికిత్స : నేట్రమ్మూర్-6× లేక 12× లో ప్రతిరోజూ వాడాలి. దీనితో కాల్కేరియాఫ్లోర్-6×లేక 12లో వాడాలి. నాడీ మండల కేస్‌లలో M.P.-6×, K.P.-6×లో వాడాలి. గ్రంథుల యందు C.P-6×తో వాడవలెను.

వా॥ల॥ : నోరు ఎఱ్ఱగా వుండుట, పుల్లని రుచులు; చిన్న పిల్లలు- నిద్రలోపళ్ళుకొరుకుట; నాలుక వెనుకభాగము పైనబంగారు వన్నె గల మీగడ లాగా వుండే పదార్థము ఏర్పడుట; గొంతు అవ లక్షణములు లేక జీర్ణకోశ అవలక్షణములలో కలుగు నాలుకపూత, గొంతు నొప్పి-
చికిత్స : నేట్రమ్‌ఫాస్-6× లేక 12×లో ప్రతిరోజూ 3 సార్లు వాడాలి. దీనితో కాలిమూర్-6× లేక 12×లో వాడిన చాలా ఉప యోగము కలుగును.

వా॥ల॥ : నోటి యందు చేదురుచి, జిగురు వంటి పదార్థము వచ్చుట; మంట; ఇది పొగాకు, చల్లగాలి, చన్నీటి వలన తగ్గుట; పంటినొప్పి, జలుబుతో కూడిన గొంతు నొప్పి, బొంగురు-
చికిత్స : నేట్రమ్మూర్-6× లేక 12×లో ప్రతిరోజూ 3 సార్లు వాడాలి.

వా॥ల॥ : ప్రతి ధాతువు నందు చీము జేరుట; మలబద్ధక ముతో కూడిన పుండ్లు;నోటిమూలలయందుపుండ్లు,పగుళ్ళు; రాత్రులు

పంటి నొప్పి వచ్చుట; ఇగుళ్ళలోచీము జేరుట, దంతాలుకదలుట; పంటి కుళ్ళు, పుప్పి పన్ను, నోటిలో పుండ్లు; దంతాలు ఆల స్యము వచ్చుట, టాన్సిల్స్‌కి చీముతో కూడిన- వాపు, నొప్పి; థైరాయిడ్ గ్రంథి పెరుగుట-

చికిత్స : సైలీషియా-30 లేక 200 లో ప్రతిరోజు 3 సార్లువాడాలి. దీనితో నేట్రమ్‌మూర్-30 లేక 200, కాల్కేరియా ఫ్లోర్-30 లేక 200 లో వాడాలి. చీముపట్టు స్వభావము గల వారికి- కాల్కేరియా సల్ఫ్-30 లేక 200 లో వాడాలి.

## జీర్ణావయవ మండల వ్యాధులు-మందులు

**వ్యాధిలక్షణములు :** జీర్ణము కాని ఆహారము వాంతి అగుట, ఎక్కిళ్ళు, కడుపులో వాయువు జేరుట, కాలేయము నొప్పి-

చికిత్స : కాల్కేరియాఫ్లోర్-6× లేక 12×లో ప్రతిరోజు 3 సార్లు వాడాలి. దీనితో F.P.-6×, M.P.-6×లో వాడాలి.

వ్యా॥ల॥ : ఏదైనఆహారము తీసుకొన్న కడుపునొప్పి ఎక్కువ అగుట; త్రేపుల వలన కొద్దిగా ఉపశాంతి; ఉపవాసము వలన నొప్పి వెన్నుకు ప్రాకుట; పాల మీద కోరిక; చన్నీళ్ళు, ఐస్ వలన వాంతులు కలుగుట; దీని బాధలు అన్నీ భోజనానంతరము అధిక మగుట; మాంసమునందు కోరిక జనిగ్కించుట-

చికిత్స : కాల్కేరియాఫాస్-6× లేక 12×లో ప్రతిరోజు 3 సార్లు వాడాలి. దీనితో M.P.-6×లో వాడవలెను.

వ్యా॥ల॥ : ఉత్తేజకర పదార్థములు కోరుచుండుట,కడుపులో మంట; పుండ్లు; టీని కోరుచుండుట-

చికిత్స : కాల్కేరియాసల్ఫ్-6×లేక 12×లో ప్రతిరోజు 3 సార్లు వాడాలి.

వ్యా॥ల॥ : పాలు, మాంసము మీద అయిష్టత; చల్లని నీరు కోరుచుండుట; బ్రాందీ, కల్లు, సారాయిలపై కోరిక; జీర్ణకోశము వాపు, గుండెవద్ద నొప్పి, త్రేపులు,తిన్నపదార్థముల రుచితో త్రేపుట

# విషయసూచిక


| విషయము : | పేజి |
|---|---|
| రచయితగా మీతో ఒక్క క్షణం....! | 9 |
| జీవ రసాయనిక శాస్త్ర పరిచయము | 11 |
| ద్వాదశ లవణ వైద్య మూల సిద్ధాంతము; ద్వాదశ లవణ పదార్థాలు; ద్వాదశ లవణాలు-నివారించు వ్యాధి భాగాలు | 12 |
| ద్వాదశ లవణాలు-తయారు చేయు విధానము | 13 |
| తరుణ, దీర్ఘ వ్యాధులు-పవర్ నిర్ణయము; ద్వాదశలవణాల మోతాదు [డోస్] నిర్ణయము; పొటెన్సీ (Potency "శక్తి") నిర్ణయము | 14 |
| మోతాదు వాడవలసిన కాల పరిమితి; సూక్ష్మ మోతాదులతో వ్యాధి నివారించునా? ఒక విశ్లేషణ | 15 |
| ద్వాదశలవణ వైద్యములో- పథ్య, పానములు; ద్వాదశ లవణౌషధములను భద్రపఱచు విధానము; ద్వాదశలవణౌషధములు లభించు పరిమాణము | 17 |
| చికిత్సా విభాగము | 18-71 |
| మానసిక కలతలు | 18 |
| శిరో వ్యాధులు-మందులు | 22 |
| నేత్ర వ్యాధులు-మందులు | 25 |
| చెవి, ముక్కు వ్యాధులు-మందులు | 28 |
| నోరు, గొంతు వ్యాధులు-మందులు | 31 |
| జీర్ణావయవ మండల వ్యాధులు-మందులు | 36 |
| మలాశయ, మూత్రాశయ మండల వ్యాధులు-మందులు | 39 |
| పురుష జననేంద్రియ మండల వ్యాధులు-మందులు | 44 |
| స్త్రీ జననేంద్రియ మండల వ్యాధులు-మందులు | 47 |
| శ్వాసావయవ మండల వ్యాధులు-మందులు | 51 |
| హృదయ మండలము, కాళ్ళు-చేతుల వ్యాధులు-మందులు | 54 |
| చర్మవ్యాధులు, జ్వర లక్షణములు-మందులు | 60 |

కడుపు నొప్పి; మర్దన, ఒత్తుకొనుట వలన తగ్గు కడుపునొప్పి; త్రేపులువచ్చును కాని ఉపశాంతి ఉండకపోవుట; కడుపులో గుడ గుడలు, అపానవాయువు బంధించుట వలన-పిల్లలలో కడుపునొప్పి, మల విసర్జనకు ముందు నొప్పి, ఎప్పుడూ అపానవాయువు వదులు చుండుట, బట్టలు వదులు చేసుకొనుచుండుట-

చికిత్స : మెగ్నీషియాఫాస్-6×లేక 12×లో ప్రతిరోజు 3 లేక 4 సార్లు వాడాలి. నొప్పి ఎక్కువగా ఉండిన ప్రతి 15 ని॥లకు 1 డోస్ చొ॥న తగ్గేవఱకు వాడవచ్చును. దీనిని 30,200 పొటెన్సీలో కూడ వాడవచ్చును. తెరలు తెరలుగా వచ్చే నొప్పికైతే.... దీనిని వాడ వచ్చును. పిల్లలు ఏడ్చుచున్న ముందుగా దీనిని వాడవచ్చును.

వ్యాధిలక్షణాలు : ఎక్కిళ్ళు,నీటివంటి వాంతులు, త్రేపుతున్న పుడు మంట, ఉప్పుపదార్థములు ఎక్కువగాకోరుట, దాహము ఎక్కు వగా ఉండి- ఎక్కువ నీరు త్రాగుట,విపరీతమైన ఆకలి, భోజనానంత రము మంట, నిద్రమత్తు-

చికిత్స : నేట్రంమ్యూర్-6×లేక 12×లో ప్రతిరోజు 3 సార్లు వాడాలి. దీనితో మెగ్నీషియాఫాస్-6× లేక 12×లో వాడాలి. కడుపులో- మంటకు గంట గంటకి 1 డోస్ చొ॥న వాడవచ్చును.

వ్యా॥ల॥ : పులిత్రేపులు, గ్యాస్ట్రిక్ అల్సర్, ఎసిడిటి ఏర్ప డుట, పుల్లని లేక కాఫీ డికాషన్ లాంటి వాంతి,అజీర్ణము; ఆహారము తిన్న 2, 3 గంటలలో వచ్చు- జీర్ణకోశ వ్యాధులు, కడుపులో మంట; గ్యాస్ ట్రబుల్ (కడుపులో వాయువు జేరుట),నులిపురుగులు లేక ఎటువంటి పురుగులైనా వుండి గర్భకోశములో శూల-

చికిత్స : నేట్రంఫాస్-6×లేక12×లో ప్రతిరోజు రోజుకి(పూర్తిగా తగ్గేవఱకు) 3 సార్లు వాడాలి. కడుపులో మంటకినేట్రంమ్యూర్-6× లేక 12×, నొప్పికి- మెగ్నీషియాఫాస్-6× లేక 12×లో తప్పక వాడాలి.

వ్యా॥ల॥ : ఎడ తెగని వికారము, పైత్యరసము, వాంతి,చేదు రుచితో వాంతి, ఈ పైత్యము వలన తల తిరుగుట, పిండి పదార్థ

ములు అఱుగకపోవుట, జీర్ణకోశము నుండి పుల్లని పదార్థము నోటి లోనికి వచ్చుట, పసికర్లు (కండ్లు, శరీరము పచ్చగా మాఱును. మూత్రము కూడా పచ్చగా వచ్చును), గాలి తిత్తియందు బొబ్బ ఏర్పడుట-

చికిత్స : నేట్రమ్‌సల్ఫ్-6× లేక 12×లో ప్రతిరోజు 3 సార్లు వాడాలి. దీనితో నేట్రమ్‌ఫాస్-6× లేక 12×లో మఱియు కాలీ మూర్ 6-×లేక 12×లో వాడాలి. కడుపు నొప్పిలో ఐతే ... మెగ్నీషియాఫాస్-6×లేక 12×లో ప్రతి గంటకి 1 డోస్ చొ॥న తగ్గే వఱకు వాడాలి.

వ్యా॥ల॥ : పసిపిల్లలు పాలు త్రాగిన వెంటనే వాంతి చేసుకొనుట, ఉత్తేజకర పదార్థములకు తట్టుకొనలేక పోవుట, జీర్ణకోశములో పుండ్లు-

చికిత్స ; సైలీషియా-30 లేక 200లో ప్రతిరోజు 3సార్లు వాడాలి. దీనితో కాల్కేరియాఫాస్-6× లో వాడాలి. పుండ్లయందు కాల్కేరియాసల్ఫ్-30 లేక 200 లో వాడాలి.

## మలాశయ, మూత్రాశయ మండల వ్యాధులు

వ్యాధి లక్షణములు: ఆసనము వద్ద పగుళ్ళు; రక్తము కాఱే- మూలశంక పిలకలు, దురద, అంతర్గత మొలలు; మలబద్దకముతో- నడుము, వెన్నుపూస చివరిభాగము నొప్పి; రక్తస్రావము, ఆసనములో తీపు, మూత్రము రంగుగా ఉండి- తఱచుగా, అధికముగా విసర్జించబడుట-

చికిత్స : కాల్కేరియాఫ్లోర్-6×లేక 12×లో ప్రతిరోజు రోజుకి3 సార్లు చొ॥న కొన్ని నెలలు వాడాలి. దీనితో ఫెర్రమ్‌ఫాస్-6× లేక 12× లో వాడాలి.

వ్యాధి లక్షణాలు : దుర్వాసనతో కూడిన అపాన వాయువులతో విరేచనాలు; వాంతులు, విరేచనాలు; శబ్దముతో కూడిన- విరేచనాలు, క్షయలో విరేచనాలు, పిల్లలకుదంతాలు వచ్చునపుడు

వచ్చే- విరేచనాలు, పిత్తకోశ మందు తాళ్ళు, బొడ్డు వద్ద నొప్పి, ఛాతీ లక్షణాలను బట్టి మాటే కీళ్ళ నొప్పులు, వాతావరణ మార్పుల వలన విరేచనాలు, ప్రక్కలో మూత్రము పోయుట; మూత్రము ఆపుకొనలేక పోవుట, సుగర్ వ్యాధి; ఫాస్ఫేట్స్, అల్బ్యుమిన్ పదార్థాలు మూత్రము ద్వారా పోవుట; మూత్రాశయ నొప్పి, మూత్ర పిండాల వ్యాధులు-

చికిత్స : కాల్కేరియాఫాస్-6× లేక 12×లో ప్రతిరోజూ రోజుకి 3 సార్లు చొ॥న కొన్ని నెలలు వాడాలి. తగ్గితే ఆపాలి. దీనితో కాలీ ఫాస్-6× లేక 12×, కాల్కేరియాఫ్లోర్-6× లేక12×లో వాడాలి.

వ్యా॥ల॥: రక్తము, చీముతోకూడినవిరేచనాలు; ఆసనములో వ్రణము, ఆసనము తేమగా ఉండుట, ఆసనము దిగజారుట, ఫిస్టులా మొదటి భాగములో చీము పట్టుట, మూత్రకోశపు వాపు, మూత్రము నుండి పస్ (చీము కణము) పోవుట-

చికిత్స : కాల్కేరియాసల్ఫ్-3 లేక 200 పొటెన్సీలో ప్రతిరోజూ 3 సార్లు వాడవలెను. దీనితో సైలీషియా-30 లేక 200 పవర్‌లో వాడాలి.

వ్యా॥ల॥ : బంక, రక్తము పడుట;విరేచనమునకు తొందర; దగ్గినా, నవ్వినా మూత్రము- బొట్లు బొట్లుగా పడుట; మూత్రకోశము వాపు; వేడిగా, ఎఱ్ఱగా, వచ్చుమూత్రము; మూత్రమునకు తొందరగా ఉండి ఆపుకోలేక పోవుట, మూత్ర బంధన, రక్త మూత్రము, మూత్రపిండముల వాపు-

చికిత్స : ఫెర్రమ్‌ఫాస్-30 పవర్‌లో ప్రతిరోజూ 3 సార్లు వాడాలి.

వ్యాధి లక్షణములు : కామెర్లలో తెల్లని విరేచనము, కాలే యము సరిగా పనిచేయకపోవుట. నులి తాడువంటి బారు పురుగులు ప్రేగులలో జేరుట, ఆసనము దురద, తఱచు వాయువు వచ్చుట, మలబద్ధకము; క్రొవ్వు, పిండి పదార్థములు సరిపడకపోవుట లేక అజీర్ణ విరేచనము, గ్రహణి, మూలా

